శ్రీహయగ్రీవాయనమః

సీరామి లింగరాజయ్యా కవివరునిచే

రచింపంబడిన

# ఈశ్వరీశతకము

ఇయ్యది

పర్లాకిమిడె జమీన్ దాగుసలాగ్రామం

కంబైండు సిస్టం స్కూలు ఉపాధ్యాయుడు

బెహరా ఆదినారాయణ

పట్నాయునిగారిచే

విశాఖపట్టణంబున

శ్రీశారదామకుటముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడియె.

1890సం॥ ఫిబ్రవరి తే 10 దీ.

ఇందులవెల 1 అణా

శ్రీపరమేశ్వర్యై నమః.

## ఈశ్వరీ శతకము.

శ్రీమహనీయ శంభుపద చింతన భక్తజనాళి కెప్పు డున్। క్షేమమె కాని క్షామమును జెందదటన్న పురాత నోక్తికిన్। నీమహి నడ్డమై దనరె నిత్తరి నుద్భవమైన కొ టిల। క్షామము దీని బోదరిమి సాధుల బ్రోవగదమ్మ యీశ్వరీ॥ ౧॥

కాండనటాలిపాలికరకాండజ కాండజ కాండకాం డ ద్వ। ఖండలఖండలాదిసురమండల మానవతీను తాం ఘ్రి వే। దండవిరోధి నీద్వితయ ధాత్రిచరాచర జంతు యుక్తసృష్టిబ్రహ్మాండకరండమండిత పిచండిని నిన్ను గొలుతుం తు నీశ్వరీ॥ ౨॥

ఉదరగత క్షుధాకులత కోర్వక జెప్పు కవిత్వమం చు నీ। విది నిరసించి పుచ్చక నవేందుమణీమయ హార వల్లిగా। హృదయమునం ధరింపు పరమేశ్వరురాణి శి వాభవాని నీ। పదగత భక్తవాక్య కృతిభారము నీదగద మ్మ యీశ్వరీ॥ ౩॥

రక్షకుడైన యీశ్వరుడు రాణదలిర్పగవచ్చి మా కు
ప్రత్యక్షముగా గనిల్చి యభయంబగు దాన మొసంగున
ట్లుగా। దక్షకుమారి దెల్పుమని తద్ద భజించెదనమ్మ వే
గదు। ర్భిక్షము బాపుమమ్మ నిరుపేదల బ్రోవ్వగదమ్మ
యీశ్వరీ॥ ౪॥

బూటకమాటగాదు యొకపూట మహాయుగమై ద
నర్చె నో। పాటలగంధి నీవికను భర్గుని జేరి మదీయలే
ము లీ। పాటికినైన బాపుమని భవ్యగతిన్ వచియింతు
మమ్మ నే। మాటికిమాటికిన్ ప్రతినమస్కృతి జేసెదన
మ్మ యీశ్వరీ॥ ౫॥

నీపతితోడ జెప్పయిన నీవయినన్ ధ్వజినీసమేతు
లై। చాపము లెక్కుబెట్టుకొని శాతశరంబులచేత వేగ
మీ। యాపదలన్న క్రూరతరమైన మృ వళి ద్రుంపర
మ్మ నే। శ్రీపతి సాక్షిగా మనవి జెప్పగ బూనితినమ్మ
యీశ్వరీ॥ ౬॥

ఆదిమశక్తి నీవె చతురాగమవేదివి నీవె విష్ణుబ్రి
హ్మాది సురాసురేంద్రుల సమ్మోహిత మోహనమూర్తి
వైన ము। త్తైదువరాలు నీవె గురుదైవశిఖామణివీవె ధ
ర్మసం। పాదిత నీవెయుంచు నిను ప్రార్థన జేసెదనమ్మ
యీశ్వరీ॥ ౭॥

స్నానము జేయు వేళ శివసన్నిధి కేగిన వేళ వేటకు
తో। పానము సేయు వేళ మృదుపాన్పున జెందిన వేళ శా
స్త్రివి। జ్ఞానము పొందు వేళ పరమాత్ముని జూచెటి వే
నీవు నా। ధ్యానమునందు నిల్వుమని తద్ద భజించెదన
మ్మ యీశ్వరీ॥ ౮॥

నిరుపమమైన నీచరణనీరజకల్పము జేరువారికిన్।
కరువను భీతి యేల బహుకష్టతరంబగు కార్యకాండ
ముల్। నురువడి జేయనేల తమనోరులు నొవ్వగ నఃగ
వేల్పుమం। దిరముల కేగి కుయ్యిడగనేల శుభస్థితి గగ్గి
యీశ్వరీ॥ ౯॥

ధాన్యము వృద్ధిగా తగిన దాతల యిండ్లను లేక
యుండుటల్। మాన్యపు బొడ్డెలెండబడి మాగి సగంబ
యిగాక పోవుటల్। శూన్యమనస్కులై నృపులు సూరి
జనావళి బ్రోవకుండుటల్। వన్యమృగీమృగావళుల వైఖ
రినుండితిమమ్మ యీశ్వరీ॥ ౧౦॥

కాటుకకొండలట్ల ఘనకాయము లొప్పు దరిద్ర
దేవతల్। పీటలవంటి దంతములు పెద్దవిదర్చుచు బీదసా
దలన్। కాటులపోటులం జదుప గన్గొన బంటుతనంబె
వాని। నీఘోటకవృత్తి గన్పరచి కీర్తి గడింపగదమ్మ యీ
శ్వరీ॥ ౧౧॥

నీకు నమస్కరించెదను నీకు ప్రదక్షిణ మాచరించెదన్। శ్రీకరమైన నీభయదసింహతురంగము నెక్కి వేగమే।యీకరువన్న బెబ్బులిని నేడుపయోధులువాటిపారగా। నాకి వధింపుమమ్మ జగ మున్నతి గావగదమ్మ యీశ్వరీ॥ ౧౨॥

మనవిమొనర్పగావినవు మారుమొగంబయి యున్నదానవో। ఘనతఘ్రుతుల్ వినంబడవొ కాంచనకమ్మయుగంబుచాటునో।తనయులుసంరదడించెదరొ తాపసకన్యలకన్నమెట్టిదో। మనసు తిరంబులేదొ ప్రతిమాట వచింపగదమ్మ యీశ్వరీ॥ ౧౩॥

హరి యురమెక్కి బ్రహ్మవదనాంబురుహాంబులుద్రొక్కి నీలకం। ధరుని నిజాంకపీఠమున తద్దయుచొక్కి సురాసురాదులం। జరణనఖాంచలంబులను స్థాయిగనుంచిన నీదుశౌర్య మీ। కదువు సడల్చుటెంత పరిజగాచుట యెంతపనమ్మ యీశ్వరీ॥ ౧౪॥

క్షామము సర్వధారి ప్రియకన్నెగ బుట్టి విరోధి జొచ్చి నిర్ధూమదవానలంబుగతి దోషవిహీన పరిజాటవీమృగస్తో। మమునెల్ల గాల్చుశరి తోయరుహానన నీకటాక్షదృ।క్శ్యామలమేఘ మార్చెనని చాటెదనమ్మ మదంబ యీశ్వరీ॥ ౧౫॥

గణికసమాజరంజనలు గాయకనాయకగానరం జనన్। త్రిణయనవిష్ణురంజనలు దివ్యపురాణప్రసంగరంజ నన్। ప్రణమితసాధురంజనలు పార్థిక్తనసత్కవిరాజరం జనన్ । గణనకు నెక్కవమ్మ దిరుగం బనిలేదు గదమ్మ యీశ్వరీ॥ ౧౬॥

నీకు నగాధిరా జిడిన నిర్మలరత్న పదాంగదాళి లో । నాకొకటిచ్చి యీకరువు నర్మిలి దాటుమనంగ రాదెసీ । శేకమనస్కతన్నడిగితిచ్చినయుక్తియు నివ్వను క్తియున్। నాకెరిగింపుమమ్మ నినునమ్మిన భృత్యుడనమ్మ యీశ్వరీ॥ ౧౭॥

ఆకును ఘంటమున్నొడసి యంగడివీధుల త్రోవ వోవగా। లోకులుకొందరారసియిలోపలి కేగుదు రింతె కాని సు । శ్లోకగత పసంగరుచి జొక్కచు గోలమి యొక్కలేమిచే। నీకరువింత జేసెనని యింట వసించితిన మ్మ యీశ్వరీ॥

స్థిరచరమైన యాస్త్రితతి చెల్లినవిమ్మట పొట్టకూ టికై। పొరుగిరుగుల్ పలాయనము పొందుటజూచి తదీ యబాంధవుల్। పర మసహిష్ణులైరి యొకపట్టునవైన సు ఖంబులేమికిన్। దెరవులుబట్టుచుం దిరుగు దీనులబోవగ దమ్మ యీశ్వరీ॥ ౧౮॥

కంచము ముంతలు న్మెరుగు కమ్ములు సొమ్ములు నిమ్ములాదిగా పం। చి యొసంగి చాలమికి బాధలొనర్చి టిసాహుకార్లకున్। వంచకులై దొలంగి ధనవంతులపంచలజేరి యాకటన్। పంచత నొందగోరు ప్రజపై కరుణింపగదమ్మ యీశ్వరీ॥ ౧౯॥

కొండలకేగి కట్టియలు గూర్చిన బర్వులు నెత్తిబెట్టియుక్। మెండగు మెట్టురాల మెలమెల్లన మేనులుగ్రుంకడిగ్గ పే। రెండను నోసరిల్లి యరుదెంచిన కొండొక కూలి దంపతీ। తండము నేలవేల సమతందగు తల్లివికావె యీశ్వరీ॥ ౨౦॥

దుంపలు తూటికాడలును తూడులు తోయములారగింపుచున్। బెంపరి ప్రాణవాయువులు బెంచుకయుండినయర్థులిండ్లకున్। బంపుము కాలిబియ్యమును పప్పు ఘృతాశనయోగ్యశాఖముల్। చంపకుమమ్మ వారికయి సాగిలిమ్రొక్కెదనమ్మ యీశ్వరీ॥ ౨౧॥

జాతులు నీతులున్మరచి జానదు గుడ్డకు దూరితాంగులై। బూతుల కోర్చి భైక్షకత బోనరసంబులు దాప్రుచు న్మహా। రాత్రిరి వేళలందు వివరంబులు లేక నెమొల్లయిండ్ల న। న్నాతురులై చరించు ప్రజనర్మిలిబ్రోవగదమ్మ యీశ్వరీ॥ ౨౨॥

చీకులు మూకలం గుడులు చేతుల జూపుచు పొట్టలంటుచున్। వాకిలివాకిలిందిరిగి వాయిడలేక పలాయితాంగ శో। కాకలచిత్తులై బొరలు టారసి యుందువుగాని వానికై। నాకలిదీర్ప బుద్ధియిడ వర్మిలి ధర్మమెరింగి యీశ్వరీ॥ ౨౩॥

వంటకు లేవు కట్టెయలు వాగిడ నోడుదు ముప్పవర్రకున్। యింటసజీవులబ్బురము లేమనియందుము చింతపండుకున్। గంటెడు తైల మామిదము గల్గదు డబ్బకరస్థశూన్య మే। వెంటభరింతుమమ్మ కరువెప్పుడు దీర్చెదవమ్మ యీశ్వరీ॥ ౨౪॥

ఇంటికిరాకమున్నె తలుపేతురు లేకరు దెంచిరేనియున్। రెంటికి దూరమంచు చనరేయని యందురుగాని యర్థులన్। పంటలకాపువారు కరపంకజ మెత్తకచారడివ్వగా। కంటను బూడరమ్మ కనికారము లేదుగదమ్మ యీశ్వరీ॥ ౨౫॥

చోరులబాధ దుష్కర మశూచివిశూచులబాధ రేబగల్। హారములేనిబాధ ఫణిహారులచేనగు రాజబాధయున్। దీరని యప్పుబాధినుమడించి పిధించిన వృద్ధిబాధలున్। భారములయ్యె భూప్రజకు బాపిమనంపగదమ్మ యీశ్వరీ॥ ౨౬॥

పిల్లలు చాటుగా తలుపుబిగ్గనదూర్చియు చోడి దప్పికల్ । తల్లులుదా్రిపజొచ్చిరి పదంపడి పుత్రులు త ల్లిదండ్రులన్। కొల్లలుబెట్టి వేరె యొకకుండలవండుకు తిందురమ్మ యీ।చిల్లరగేస్తులిండ్లగల చిక్కులు దీర్పగ దమ్మ యీశ్వరీ॥ ౨౭॥

చన్నులు పాలుచాలనికి సందడినేడ్చెటి చంక బిడ్డలన్। తెన్నులబెట్టి యాకలము దెచ్చుటకై తమతల్లు లేగా। కన్నులనీరుగార ములుకంపల జొంపములం దిరుంగుచున్। మన్నులుదిందురమ్మ నిజమాతల కేడ్చెదర మ్మ యీశ్వరీ॥ ౨౮॥

అగుపడ వావకాయలును నద్భుతమయ్యె ఘృతాన్నపూపముల్। పిగనోనిపోయె నున్నమిత పప్పులు నుప్పులు నప్పడంబులున్। డిగిచనె శర్కరంబులు కడింది వడెంబులు వంగొరుంగులున్ । పొగలెదరమ్మ వారికవి పొందొనరింపగదమ్మ యీశ్వరీ॥ ౨౯॥

నదుల తటాకకూపముల నాకటికోడి గుభిల్లుభిల్లునన్। కొదువులకోర్చి దాటిపడి గృంకుచు దేలుచు ప్రాణవాయువుల్। వచులుదురింతకన్న దురవస్థలులేవని విన్నవింతు నీ। పదయుగళంబుచెంత నివిబాపి మనంపగదమ్మ యీశ్వరీ॥ ౩౦॥

పోరిపోరి బొక్కుచుం దిరిగి పూటకు దెచ్చిన చాలెడన్నియున్। మరిగెడునీటిలో వయిచి మాఁపును రేపును దాఁచి కాలముం । జరిపెటి కూటభిక్షులకు జల్లగ నాకటిచిచ్చునార్ప స। త్వరగతి నన్నదాన పరిధానములంపగదమ్మ యీశ్వరీ॥ ౩౨॥

మొక్కి భజించువారి కొనముక్కున నూపురులాడునప్పుడే । నెక్కొని జీవనౌషధము లిచ్చి మనంపగ వెజ్జురాల వీ। వక్క తెవేనిగాని మహిమోన్నతి నింకొకవేరెగల్గ ర। మ్మక్కలు నిక్కమీవచన మారడి బుచ్చకుమమ్మ యీశ్వరీ॥ ౩౩॥

కొందరువంశమూలములు కొందరునవ్యతదీయ ధాన్యముల్। కొందరు కొండలన్ దిరిగి గుంది నిజంబుగ పిండిగుండలన్ । గ్రందుగదించు నూపురులు గాచుకొయుండిన దీనకోటిపై । నెందుకురాదు నీకరుణ యేర్పడ జెప్పగదమ్మ యీశ్వరీ॥ ౩౪॥

గలజరి గోగుతంబెములు కాకర శాసర పొన్నగంటికల్ । బలుసులు బొప్పమాకులును బచ్చలి తీవలు తోటకాడలున్। ములగచిగుళ్లు నెల్లితరు మోకలు దించు త్వగస్థిమాతులై । యలవడు కష్టమానవుల యార్తులడంపగదమ్మ యీశ్వరీ॥ ౩౫॥

గరిమచరంగు బంగరముగా నిలుముంగిటి కల్ప
శాఖిగా। పరిసర మేరుభూధరశుభాకృతిగా తమ దొడ్డి
ముంగిటన్। దిరిగి మెలంగియాడు సురధేనువుగా గనుప
ట్టునమ్మ నీ। చరణసరోజ భక్తిరమ శాశ్వతలక్ష్మిగద
మ్మ యీశ్వరీ॥ ౩౬॥

మిత్రులమిత్రులైరి ధనమిచ్చిన దాత లదాత
లైరి సత్పాత్రులపాత్రులైరి గురుభక్తులభక్తులైరి
సజ్జనుల్। ధాత్రిని నెట్లు పాపములు దాల్చెదరమ్మ భ
వత్పదాంబుజ। స్తోత్రము దక్క వేరె యొకత్రోవయు
లేదుగదమ్మ యీశ్వరీ॥ ౩౭॥

కన్నుల జూడుమంటి కనికారము నాపయి నుం
చుమంటి యా।పన్నుడనంటి ఘోర భవబంధము నెల్ల స
డల్చుమంటి నీ। పిన్నకుమారురీతి నను ప్రేమ గనుంగొ
నుమంటిగాని నీ। కున్న చిరాస్తులేమయిన కోరికనిమ్మన
నమ్మ యీశ్వరీ॥ ౩౮॥

అమృతకరాంశు తుల్యమగు హారములిమ్మన ర
త్నముద్రికల్। విమలదుకూలవస్త్రములు వేడను మన్మథ
మోహనాంగులౌ। రమణుల నాకొసంగుమని రాయడ
జేయనుగాని నీదయా। సుమహితదుగ్ధవార్ధి సుఖసుప్తిని
గోరెదనమ్మ యీశ్వరీ॥ ౩౯॥

పిన్నతనంబునుండి నిను బెక్కువిధంబుల బ్రస్తు తించినన్। యెన్నటికైన రాదు కృపయేటికి నాతనువిం క వేగమే। తన్నిపడంగద్రోచి సగతాసుని జేయు మదే వరంబుగా। క్రొన్నెలదాల్పు వేల్పు కడకుంజని దెల్పెద నమ్మ యీశ్వరీ॥ ౪౦॥

మృగపతియాన నిన్ను నెదమేల్గని గొల్చిన వారిదోషముల్। నగములవంటివైనను వినాశము నొందక యున్నె వాగ్ఝడిన్। నిగమములాదివిద్యలును నీరయి పారకయున్నె బ్రహ్మమున్। మొగమున వెల్గకున్నె రవిముద్రశతంబులు భాతి నీశ్వరీ॥ ౪౧॥

సగము విశాలనేత్ర కిడి చారుమృగీమదచందనాదులున్। జిగిగొనియున్న మైసగము శ్రీకుధరభ్రమరాంబ కిచ్చి ము। జ్జగములు నీకొసంగియు ప్రసన్నత దప్పితిరోహితాంగుడై। నగుపడడమ్మ యీశ్వరుడు నార్తుల బ్రోచుటకోడి యీశ్వరీ॥ ౪౨॥

ధరణిని మ్రొక్కు దీనులకు దర్శనమియ్యడనిచ్చి వేగమే। మెరువును బూచి సస్యములు మేఘుడు గాచిన లీల బ్రోచినన్। తరుచుగ నీను కీర్తి హిమధామరుచుల్ ప్రకటించు లేనిచో। కరువను త్రాట గృవ్వబడి కాయము లూడ్చెదరమ్మ యీశ్వరీ॥ ౪౩॥

పావనమూర్తి నీచరణపంకరుహంబు లెదం ద
లంచినన్ । కావలసున్న కృత్యములు గాక ముణుంగవ
టంచు సర్వదా । దేవగురుండు ముఖ్యమగు దైవతసా
క్షిగబుట్టు వార్తలున్। బోవిడువంగ నీకు నిది బుద్ధియ
గాదుగదమ్మ యీశ్వరీ॥ ౪౪॥

పగలు దివాంధపక్షులు విభావరివేళ సమస్తప
క్షుల। న్నగుపడకుండ జేసె విధియంచు విరించి నిరాక
రించి దా। పగలును రేయు దీనజనపక్షుల నన్నములే
ని చీకటుల్। మొగమున గట్టినట్లునిచె మూర్ఖపు యీక
రువమ్మ యీశ్వరీ॥ ౪౫॥

వదలదు వేదమంత్రముల వాసి దొలంగ దశీహ
తంబులన్। బ్రిదులదు హోమయజ్ఞముల బెగ్గిలిపారదు
పెద్దలున్నచో। నిది రహీరండిమొండి జరటిన్ మొరటిన్
కరటిన్శిఖండినిన్। మొదలిటబట్టి యీద్భు గురుముద్రశ
శాసనమీయు మీశ్వరీ॥ ౪౬॥

గురుకులవాసులైన బుధకోటుల నేకులు లింగమ
జ్జన। స్ఫురణలు దీర్చి నీకెదురుజూచుచునుండిరి· వారికై
దగన్। పరిసరరుద్రకన్యకల పాణిపుటంబుల భక్ష్యభో
జ్యముల్। సరసరసాన్నశాఖములు సన్మతి నంపగదమ్మ
యీశ్వరీ॥ ౪౭॥

దశవిధ నాదకన్యకలు తాండవమాడు హృదంబురాశిలో। ప్రశమనకెక్కనట్టి క్షుధబాయని బాడబమట్లనుండునో। దశదళపద్మవాసినివు దాసి భయంబుహరించి భూప్రజన్। వశముగనున్న నీకరువు నొక్కరఘుంట హరింతురీశ్వరీ॥ ४౮॥

అంటుకుయున్న పొట్టలును యస్థిత్వగావృతమైన మేనులున్। తొంటరిగాళ్లు నూసలకు దోడగు చేతులుచింపి పెందలన్। తుంటరి బొట్టగోచులును దొప్పలగంజులు దాగివజూపె నీ। కంటకవృత్తి తామగిహ గర్వమడంపగదమ్మ యీశ్వరీ॥ ४౯॥

లవణము శూన్యమున్ గటువు లక్ష్యపదంబుకురాదు తింత్రిణిన్। దవిలివసింపదోత్మరుచి చా మదిగోరదుగాన షడ్రుచుల్। గవయని యోగిపుంగవుల కైవడి స్పృక్కదరమ్మ భూప్రజల్। ప్రవిమల భక్తిలేని క్షుధబాధ గృహాటవులందు యీశ్వరీ॥ ५౦॥

విలసిత నీకటాక్ష రుచి వృష్టి జలంగినగాని లేనిచో। నిలయపొలాలనున్న కడు నీరస మానవ సస్యరాజికిన్। కళలుదయింపవమ్మ పులకాంకురచిహ్నాలు గల్గవమ్మ। వ్యాకులతలు వీడవమ్మ కృపగూర్చిగనుంగొనుమమ్మ యీశ్వరీ॥ ५౧॥

ఉదరగతక్షుధాకులత కోరిచి కొందరు దైవ లీ
షాణన్। వదలక నిష్ఠ సల్పి నిలువంబడి భక్తి ప్రదక్షిణం
పగా। పదయుగళంబు సాగమికి బ్రస్తుతి సేయగ నోరు
రాఖికిన్। ముదుకుల భంగి గర్భగుడిమూల వసించెదర
మ్మ యీశ్వరీ॥ ౫౨॥

కసవు పశువ్రజంబులకు ఖండలు రక్తము వ్యా
ఘ్రజాతికిన్। కుసుమపరాగపుంజ మళికోటికి మన్మథ
కేతనాళికిన్। వసుధప్రవాహ వారి లవ వాంఛ దలిర్ప
మనుష్యరాజికిన్। కొసరక నన్నమిచ్చిన యకుంఠిత దా
తవు గావె యీశ్వరీ॥ ౫౩॥

శంకరు నంకవాసివయి చందన కుంకుమ లేప
నాంగివై। కింకరధర్మవృత్తి పరికించియు బ్రోచుట కం
కితలేల శో।భాకరి శంకరీ శివుని పట్టపు రాణి మణీ ఘృణీ
లస। త్కంకణ కింకిణీ నినద కాంచిక భూషణివై మ
హేశ్వరీ॥ ౫౪॥

క్షామము క్షేమమాను మనుగడ్డలు బంగరు తు
నక్లౌను।నిర్ధనామదవానలంబ యినతోయము యుండును
ధూర్తులైన శ్రీ। రాములవంటివారగుదురమ్మ భవత్క
రుణాకటాక్ష మే। జోమహిమంబుచేత నని చొక్కి నుతించెదనమ్మ యీశ్వరీ॥ ౫౫॥

స్త్రీమదమెక్కి కీచకులు సీధువు పానము జేసి
యాదవుల్। రామనృపాలు వంచకత రావణ ముఖ్యులు
రాజ్యమీక వై। రామము నొంది రాజి ధృతరాష్ట్రతనూ
జులు క్షామవహ్నికిన్। దోమలునైరి భూజనులు దోష
ములేమియు లేక యీశ్వరీ॥ ౫౬॥

కాముఁడతిప్రయోజకుఁడు గావున నిక్షుధనుర్వి
ముక్తమౌ। కోమల పుష్పబాణములు కప్పలుగా గురి
యించి యీశునిన్। కోమలి నీకు నొక్కదరగోళము జే
సెనుగాని లేనిచో। స్వామినివైతె యీబహుళ క్షామ
ము కోడుదురేమొ యీశ్వరీ॥ ౫౭॥

ఉత్తరదక్షిణాయనము లొక్కకర్కటక చం
ద్రసూర్యులున్। మొత్తము గట్టి దైవతసమూహము లె
ల్ల మహాటకాద్రికిన్। నెత్తుగనున్న తచ్ఛిఖరి శ్రీశిఖరం
బునకున్ ద్రిమూర్తులున్। తత్తరమంది క్షామగ్రహాధా
టికి బెగ్గలి బారిరీశ్వరీ॥ ౫౮॥

చినుకుల మేఘమండలము చెంత తిరోహిత చం
ద్రబింబమై। మినుకుల్ దేగుచంద్రకితమింట దగద్ధగమిత్ర
బింబమై। యనుపమ నేత్రమధ్య ద్విదళాబ్జ మణీమయ
మంటపంబునన్। గనుపడు నీపదాబ్జరుచి గ్రాసమునా
కు ప్రసాదమీశ్వరీ॥ ౫౯॥

నీదు దయాపయోనిధియె నిక్కపు స్నానసరో వరంబుగా। నీదు కటాక్షవీక్షణమె నిర్మల పట్టు ఝరీప టంబుగా। నీదు ముఖేందుబింబరుచి నిత్యసుగంధ విలేప నంబుగా। బ్రోదిగ నీదభక్తజనపుంజము బ్రోవగదమ్మ యీశ్వరీ॥ ౬౦॥

కాశిని నన్నపూర్ణవయి కంచిపురంబున కామ నేత్రవై। భాసిలు శ్రీగిరిన్ భ్రమరభామినివై బెజవాడ పీటిలో। వాశితహేమదుర్గవయి వర్ధిలుచుండి జగత్ప్ర భుత్వమున్ । జేసిన నీకువందనము జేసెదనమ్మ మదంబ యీశ్వరీ॥ ౬౧॥

వాసుకి భోగపీఠవయి వాసుకిభూషణ నంకపీఠి వై । దాసులకంఠపీఠివయి ధర్మపథంబగు లక్ష్మిపీఠివై। భాసుర నష్టసిద్ధులును బంగరు బంతుల భంగి నాడు నిన్। గ్రాసమొసంగి బ్రోవుమను కారణమేమి మనీషి కీశ్వరీ॥ ౬౨॥

జాతియు వర్ణమాశ్రమము చాలకులంబును గో త్రనామమున్। కైతవకల్పితభ్రమలు కామము క్రోధమ దాదులాది సం। ఘాతపు జాతరందవిలి కాలము వుచ్చె టి మాదృశాళికిన్। చేతనవృత్తి చూపి యరిచేత ప్రసా దముబెట్టు మీశ్వరీ॥ ౬౩॥

జాతములెన్నియెత్తితినో జంతులయోనిముఖాం
తరంబులన్। నాతరంమమ్మ లెక్కయిడ నల్వురకునైనవశం
బుగాదు బల్। పాతకవర్తివీడనుచు పాదము దన్నియు
దోసచిపుచ్చగన్। జాతుల కత్తి జన్మచెదచీమల నల్పగద
మ్మ యీశ్వరీ॥ ౬౪॥

మాయనునింటనిల్పి బహుమానపురస్కృతి జేసి
యాంత్మలో। బాయని ధర్మము న్నడవిపాలొనరించిన
పాపకర్ముడీ। కాయపువేషధారియని గ్రక్కున నన్విడ
నాడజూచితిన్। న్యాయముగాదు నీకు గురున్యాయము
నాక్రగింపు మీశ్వరీ॥ ౬౫॥

నీవర దాన కల్పకము నీడ వసించిన పండితా
ళికిన్। నేవిధినైన చేకురు నభీష్టఫలంబులు వానికేమి గ
ర్భావహమైన యర్భకుని వారయనుండగ బోయిచు త
ల్లిగా। నావినయాపవేకములు నంగడి బెట్టక బోవు
మీశ్వరీ॥ ౬౬॥

తనువను గాలిమేడ కడ దాచిన గుప్తధనాల
గోలెము। ల్తనయులమైన మమ్ము దయ డగ్గరబిల్చి తదీ
యవిత్తముల్। దినుమని యివ్వకున్న పరదేశ మతస్థులమై
నమీదటన్। ఘనతలు కీర్తిజాలములు గల్గవు నీకు మదం
బ యీశ్వరీ॥ ౬౭॥

అరువదియారురుగ్మతల కాస్పదమైన శరీరధా
రుడై। యిరువదినాల్గు తత్వముల యింట వసించు పరా
పరాత్ముడై। యరువడిహంసదృష్టిశిఖి నూది గరంగిన
హేమపూదె గా। నిరువురునైక్య మొందుతల మెద్దియొనా
శ్రితగింపుమీశ్వరీ॥ ౬౮॥

ఆరిట నంటనీక భ్రమ లారిటికిందను జూపనీక
లో। నారు సరోజవీథులను నాడుచునుండిన నారుమూ
ర్తులన్। నారిటనర్తితంబయిన నారుప్రసాదములారగిం
పగా। గోరితినమ్మ తద్గురుచులు గుప్తముగా దయచే
యు మీశ్వరీ॥ ౬౯॥

పూరుషపత్య మబ్బె నని పుట్టిన యప్పుడు తల్లి
దండ్రిలో। భారతి నెత్తిపెంచు ఋణపైత్రృఋణంబులు దీ
ర్పలేమికిన్। నీసధర్మినై పుడమి నీగతినుండితి నింకమీద
టన్। పౌరుషవృత్తి దైవఋణభార మెలాగు హరింతు
నీశ్వరీ॥ ౭౦॥

ఏరుల రెంటికి న్నడుమ నెవ్వరి గ్రాహ్యముగాక
శూన్యమై। బారు సరస్వతీజలము పాణిపుటంబుల చల్లి
లాడుచున్। బారణసేయు వారలదె భాగ్యము భోగ్య
రమావిశేషముం। దూరములేని మోక్షపురిత్రోవ యిదే
యెరిగింపుమీశ్వరీ॥ ౭౧॥

కాయము గుంచి గర్భనరకంబుల గృంగిన నాదు తల్లికిన్। గాయభయంబు చూపి మలకాయుడనై జనియించు వాడు చే। దో యిలమోపి బంగుచు ధూళులభ్రంగిగనాడు నీవు నా। కాయము సంగ్రహించిపుడు కన్నెడజేసెద వేల నీశ్వరీ॥ ౭౨॥

తల్లియు దండ్రియున్ గురుడు దాతయు దైవమనీవెయంచు నా। యుల్లపుదమ్మి నమ్మి శివయోగమహాసుఖవార్ధి దేలకన్। యిల్లనుచీకటిందపిలియే విధియించిన కర్మకాండముల్ । పొల్లునదంచు బియ్యమను పోలిక లాభములయ్యె నీశ్వరీ॥ ౭౩॥

పంచగబారె వెంట్రుకలు బల్లుదురు ల్లదులాడజొచ్చెను। ద్దండత దప్పె నిం(దియమదావళిరాజిమనో నిలంబులున్ । రెండొకచోట నిల్వమిని రేబగలొక్కరఘుంటవేళగా। నిండిన భక్తి నిన్ గొలుతు నిత్యశరీర మొసంగు మీశ్వరీ॥ ౭౪॥

చెయ్యికి చెయ్యి దాగ్చుగతి చిత్తమెలర్పగ మోక్షమన్ వరం । బియ్యమి యివ్వకుండగని వేగితి వాబిరు దాంకపాలికల్। దియ్యమిదియ్యకుంటె నిను తిట్టకమానను నీదునాను బల్। కయ్యము గాకపోదు నదిగల్లక దర్శనమబ్బదీశ్వరీ॥ ౭౫॥

అద్దము చేనమర్చుకొని యందుల బింబముజూచి
కొందరున్। ప్రొద్దులుబుత్తు రేమిటికొ పుష్కలహృన్మణి
మంటపంబునన్। ముద్దులు గుల్కుచుండు నిజమోక్షరమా
మణి మోము దామరల్। ప్రొద్దునబూడ లేమిటికొ పూర్ణ
దయామతి దెల్పుమీశ్వరీ॥ ౭౬॥

కాయలుపండ్లు నీకుగాని కానుకలిత్తు రదేమిభ
క్తి దాన్। కాయమహీరుహంబునను గల్గు ఫలాదులు పు
ష్పజాతులున్। దోయిటబట్టి నిందలచి దోచినమాత్రము
శేషమందుచున్। బాయక గొల్చు పెద్దలది భక్తియు గా
నెదనమ్మమీశ్వరీ॥ ౭౭॥

కరమరుదైన మాయగత కర్మశరీరుని జేసి నన్ను
దు। స్తరతరమైన యింద్రియలతావితతిన్ ప్రతిబద్ధుజేసి
భా। స్వరరుచి భక్తిశూన్యగతసారగృహాటవి ద్రోచి
పుచ్చగా। దురితము లేమిజేసితినొ తొల్లిభవంబున జెప్పు
మీశ్వరీ॥ ౭౮॥

నిరయసమీపభూములను నెక్కొని రాజభటుల్
హుటాహుటన్। కరములు బట్టి రాదిగుచు కాలమునం
దెవరమ్మదిక్కు నీ। వరసికుమారి వీరవర భైరవముఖ్యు
ల బంచి తద్బలం। బరిమురిగా బడల్బరచి యార్తులబ్రో
వగదమ్మ యీశ్వరీ॥ ౭౯॥

దినకరసూను డున్న దెస దీర్ఘవిలాపము లాలకిం
చి న।య్యానిమిషవల్లభుండు సురమానిని జూచి యిదేమి
కోయనన్। జనములు మర్త్యలోకమున క్షామమహాగ్ర
హాదగ్ధజీవులై। యినజుని జేరువేళ జనియించు రవంబని
దెల్పు నీశ్వరీ॥ ౮౦॥

రవికుజు లేకలగ్నమున రాగను క్షామము పుట్టై
దానిచే। భువి నపవృష్టిదోషమును పొందె తదీయమహా
తపంబునన్। యవముఖసస్యముల్ మడసె నందున నన్న
ములేమి భూజనుల్ । దవిలిన యార్తరావమని దైవతప
స్వి వచించె నీశ్వరీ॥ ౮౧॥

కఫములు దగ్గులున్ లొసుగు కాళ్లును జేతులు బీ
కు వాతముల్ । విపుల జ్వరాతిసారములు వెన్నులు నొ
ప్పులు గర్భశూలముల్ । నపహాతపత్య దోషముల నన్న
ములేమికి భూజనావళుల్। తపనజుపోలితోవగన తల్ప
రులై రిగదమ్మ యీశ్వరీ॥ ౮౨॥

రెక్కలు రాకమున్న కనురెప్పలు దేలకమున్న
గూటిలో। సృక్క పులుంగుపిల్లలకు జెన్నలర న్నవి గ
ల్గునప్పుడున్। దిక్కులు నొక్కమాత్రమున ద్రిమ్మరజూ
చినమాటిక్క పండితుల్। చిక్కులువాసి నీకృపను జెంది
సుభల్ గనుగొందురీశ్వరీ॥ ౮౩॥

పరహితశక్తి దైవగురుభావన యుక్తియు సా
ధుశక్తియున్। చిరతరమయిన భక్తియును చింతవిరక్తి
యు జీవముక్తియున్। నిరతము తృప్తియుం గలిగి నిర్జ
రనాయకలక్ష్మి బూడకన్। గరిమజలంగు నీవరము గైకొ
నకోవిదులుందు నీశ్వరీ॥ ౧౪॥

సరసతసాంఖ్యతారకవిచారులు కొందరు యో
గసాధ్యులై। యరుకపరాక్షులుం గరిపి యాత్మపదస్థిత
శిష్యరాజికిన్। జెరిచెదరింతెగాని యరిచేదృశమైన ఘన
స్కయోగ సుస్థిర భరితార్పణానుభవ సిద్ధి పిధింపగ
జాలరీశ్వరీ॥ ౧౫॥

పరమపవిత్ర పంకజభవస్తుతి పాత్ర లలాటనే
త్ర శ్రీ। కరశివగాత్ర భావపరికల్ప మనీషచరిత్రవాశిక।
స్ఫురగురుసూత్ర నీమహిమ జూడగ కన్నులుజెప్పనోరు
యున్ । సరిపడవమ్మ వేలయున సంఖ్యలు గల్గిన నేమొ
యూశ్వరీ॥ ౧౬॥

జలకలశల్ పయోనిధులు చంద్రరవుల్ తదనుష్ఠ
జ్యోతికల్। ఫలములు పర్వతంబులును పత్రి సుమంబులు
వృక్షజాలముల్। చెలియలు ధారతీరములు జెన్నగు బా
ష్పములు పంచభూతముల్।జలజభవాండ మాదుకొనుసా
ధముగా విహరింతువీశ్వరీ॥ ౧౭॥

శివపదచింతనామృత విశేషపయోనిధి నోలలాడు దుర్భవభవకర్మసంకలిత పంక కళంకము వాసి నేత్రద్వ । గ్వనిక మేఘమండల వశంకరమైన తటిల్లతాత్ములౌ। కవ్రులుగదా స్తుతించి నిను గందురభీష్టఫలంబు లీశ్వరీ॥ ౮౮॥

భక్తి సురాగమంబునకు భావనయుక్తి ఫలప్రదానమై। రక్తిమచూపు దేహికి నిరంతర సౌఖ్యము చూపు భుక్తియున్। ముక్తియు చూపు గాన గురుముఖ్యుని జేరి తదీయవాక్యమా। సక్తిని గైకొనంగవలె సజ్జనులైతె ధరిత్రి నీశ్వరీ॥ ౮౯॥

అనాహత చక్రమందు లయమౌ ధ్వని తద్ధ్వనియందు లిప్యమై। గనుపడుచుండు కేవలమఖండబయల్ గల జ్యోతిదానిలో। మనసు వెలుంగు నామనసు మందిరమందు తిరోహితాంగుడై । యమిషవృత్తినున్న పరమాత్ము గుణన్ గనుగొంము నీశ్వరీ॥ ౯౦॥

దేహమహామఠంబున ప్రతిష్ఠితుడై దగు జీవదేవుడే। దోహదుడై సదాశివుడు దూరగతస్థుడు గాక లోపలన్। సోహముమార్చకుండగుచు శోభిలుచున్న సకీలకంబు నే। దేహికినబ్బు నాతడె యతీశ్వరుడీశ్వరుడమ్మ యీశ్వరీ॥ ౯౧॥

కాయమహీధరంబునకు కారుమృగంబులు క
ర్మకాండముల్। బోయలుదుర్గుణావళులు భూరుహజా
లములూహ మోహముల్। చాయనిగండశైలములు భా
ర్యసుతాలయాలంకటాదులున్। దోలగ దీని నెత్తగల
దోర్బలులెవ్వరి గానమీశ్వరీ॥ ౯౨॥

సతత కుటుంబలంపట విచారకృశీకృత దేహయ
ష్టిలో। తుత్రమును శీలముం గుణము చిత్తశమంబు ప్రి
చేతనత్వమున్। కృతకఫపక్వకుంభ పరికీర్ణఘృతామృత
వారిబిందులున్ । హతము సమానమైబరగు టబ్బురమే
మియులేదు యీశ్వరీ॥ ౯౩॥

హరుపరమేశు వాజ్ఞగొని యర్త్మలి మండగిమాద
మాంబకున్। వరసుతుడై జనించి బసవప్రభు డల్లమరా
యశిష్యుడై। భరితశివార్పణానుభవ భక్తియు ముక్తి
యు భక్తరాజికిన్ । ధరణినొసంగి తావకపదస్థులు ధ
న్యులుగారె యీశ్వరీ॥ ౯౪॥

శూలగతస్థుడానరుని శూలము గేల గదల్చకుండ
నన్ । తాలిమినించుకించుక కృతత్సుఖమైదగు మాట్కా
ఘూర క।ర్మాలయలంపటస్తునకు నబ్జముఖీ త్వగలంకృ
తాదులున్। తూలికసౌఖ్యముల్ గరువు తుచ్ఛవు భోగ
ములమ్మ యీశ్వరీ॥ ౯౫॥

నీపదభక్తి సత్కృతము నెక్కొనువారుగదా భ
వాంబుధిన్। గోపదమట్లు జూచెదరు గోర రభీష్టము లు
ర్వ్యలోపలన్। కాపురసౌఖ్యముల్ మనసుగైకొనరవ్యయ
మైన నిశ్చల। ద్వీపలతావితానముల దివ్యబురిందలపొప్పి
రీశ్వరీ॥ ౯౬॥

అన్నము బ్రహ్మమంచు బుధులానతి నిచ్చిన
మంత్రవాక్యముల్। నిన్నటిసోమవాసరము నేటికి తత్ఫ
లమందజేసె నో।సన్నుతభక్తలోకసురశాఖిని నీకు తెదీ
యలేమి నే।నన్నప మాచరించితిని వేరొక చింతనలేక
యీశ్వరీ॥ ౯౭॥

ఇష్టము ప్రాణభావమున నేకముగా నడిపించు
నేర్పు చా।షష్టి కళాకలాపములు సాంగముగా విధి
యించు నేర్పు నీ। సృష్టిచరాచరాదులను జేరి నటించి
న నేర్పుగల్గు నీ।దృష్టివిలాసభ్రూలతిక ద్రిప్పిన మాత్ర
బుధాళికీశ్వరీ॥ ౯౮॥

గ్రోలెద నీకథాసుధము గ్రోలెద నీపదపద్మసా
రమున్। గ్రోలెదనీదునామ ఘటగుంభితమైన ప్రసాద
రేణువుల్। గ్రోలెద నీకటాక్షమధుకోశగతంబగు దేనె
బిందువుల్। గ్రోలెద నీదు భక్తి సురగోఘృత ధార
గౌరి యీశ్వరీ॥ ౯౯॥

రమ్మని చేరబిల్చి సుకరంబగు హస్తము నా(శ
యం)బునై। నెమ్మది జేర్చి వేర్చియు నేరక జేసిన పాప
పంకమున్ । సమ్మతి నీదయారసవశంబున నే విదళించి
పంచ కల్పవృక్షముల చాయనిల్పి నను ప్రస్తుత మోక్షమొ
సంగుమీశ్వరీ॥ ౧౦౦॥

చాతక మంబుదోదరవశంబగు బిందువుకాగలిం
పుచున్ । ప్రీతిని జూచువేళ నతిభీతి విధించిన గర్జనాకృ
తిన్ । నీతరుణార్క పాద రుచి నే భుజియించి భజిం
చువేళ నీ। కైతవ మానసోక్తి నిజకర్ణగతంబగునమ్మ
యీశ్వరీ॥ ౧౦౧॥

రెండు బదారునుం బదియు రెండు పదారును
నాల్గు రేకులున్। నిండుకొాయున్న తోయరుహానిచ్చైన నె
క్కి సరోజవీధిలో । నుండు పదార్థముల్ గొనుచు నో
హరిసాహరి హంసరూపివై । పండితరాజయోగులకు
పండగసత్రమిధింతువీశ్వరీ॥ ౧౦౨॥

నీమహామానుభూతిజనియించిన శైవమతస్థులం
..గామి కులాబ్ధిచంద్రుడన భ్రాజిలు సాంబశివాఖ్య
పుత్రరత్న మనగా దగు సత్కవి లిం
క్షేమ కవిత్వ సత్కృతిని జెన్నలరారగ

క॥ శ్రీయుత బెహరాకులనిధి। నాయక విధుడైన యాదినారాయణ ప్రఖ్యాయుండీకృతి రత్నము। శ్రీయోనిధి యనుచు నచ్చుజేయ దలంపన్॥

గీ॥ సకలభక్తులవంశాబ్ధిచంద్రుడైన। వీరన సుబుద్ధి తనకీర్తి విబుధజనులు। మెచ్చి కొనియాడ ప్రకటించె నచ్చుపరచి। చంద్రతారార్కమీశ్వరీశతకమనని॥

సమాప్తము.

